





# గేయాలు

పౌరాణిక,జానపద,సామాజిక

## పాడవే కోకిలా





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పాడవే కోకిలా!

రేగులపాటి కిషన్‌రావు

విజయలక్ష్మి పబ్లికేషన్స్
చింతల్‌ఠాణం—505 405.

# మంచి కవిత

కవిత చదువుదాం మంచి
కవిత చదువుదాం
కవిత చదువుదాం గొప్ప
కవిత చదువుదాం ॥కవిత॥

లహరి లాగ సాగిపోవు
భావాలతో నిండియున్న
హృదయాలను తట్టిలేపు
శబ్దశక్తి కలిగియున్న ॥కవిత॥

అజ్ఞానపు చీకట్లను
తరిమివేయ గలిగినట్టి
విజ్ఞానపు తేజస్సును
మన ఎదలో నిలుపునట్టి ॥కవిత॥

మనసులోని కలతమాపి
ఉత్సాహము ఎదను నింపి
కొత్తదనము కొరకు మనసు
పరుగుతీయునట్లు చేయు ॥కవిత॥

కటిల గుణం కూలద్రోసి
సుగుణాలను కూర్చునట్టి
మంచి చెడులు తెలిపి మంచి
మనస్సునే పెంచునట్టి ॥కవిత॥

# ఆనందము

కోకిలమ్మ
పాట ఒకటి పాడుచున్నది.
నెమలి ఒకటి
నాట్యమేమొ చేయుచున్నది.
చిలుక ఒకటి
మధురముగా పలుకుచున్నది.

చిట్టి తల్లి
కోకిలవలె పాడగలిగితే
నెమలిలాగ
నాట్యమామె చేయగలిగితే
చిలుకలాగ
మధురముగా పలుకగలిగితే
కన్నతల్లి
ఉల్లములో జల్లు కురువదా?
ఆనందపు జల్లు కురువదా?

# అదృష్టము

బంగారు గిన్నెలో
దూకగలిగిన చినుకు
బ్రతుకులో మార్పేమి
పొందగలిగేను ?

ముత్తియపు చిప్పలో
దూకగలిగిన చినుకు
బ్రతుకంత ముత్తెముగ
గడుప గలిగేను.

# మేలు చేసినారు

మన పూర్వులు పుణ్యాత్ములు
మహోన్నతులు మన పూర్వులు
మేలు చేసినారు గొప్ప
మేలు చేసినారు మనకు ॥మన॥

జ్ఞానధనులు త్యాగధనులు
విజ్ఞానము పెంచి పంచి
మేలు చేసినారు గొప్ప
మేలు చేసినారు మనకు ॥మన॥

విజ్ఞానము జోడుచేసి
పనులు వారు చేసినారు
నవ్యత కనుగొన్న వారు
మనకు మేలు చేసినారు ॥మన॥

సులభముగా పనులు చేయు
అనుభవాలు మనకు తెలిపి
మేలు చేసినారు గొప్ప
మేలు చేసినారు మనకు ॥మన॥

మన పూర్వులు మహాత్ములు
ఘన సంస్కృతి నందజేసి
మేలు చేసినారు మునులు
మేలు చేసినారు మనకు ॥మన॥

నైతిక విలువలను పెంచు
చట్టాలను చేసినారు
మేలుచేసి నీతిపరుల
మన్ననలను పొందినారు ॥మన॥

రేగులపాటి కిషన్‌రావు

పలు భాషలు పలు విద్యలు
పెంచి పంచి ఇచ్చినారు
మేధావులు మనకు గొప్ప
మేలు చేసి వెళ్ళినారు ॥మన॥

భౌతిక సంపదలు పెంచి
సుఖములెన్నొ మనకు పంచి
మేలు చేసినారు ఘనులు
మేలు చేసినారు మనకు ॥మన॥

బాలునన్ని ఉత్పత్తులు
చేయు విధము తెలిపినారు
మేలు చేసినారు జనులు
మేలు చేసినారు మనకు ॥మన॥

పలు రకాల పరిపాలన
పద్ధతులను పదిల పరచి
రాజనీతి మర్మజ్ఞులు
మనకు మేలు చేసినారు ॥మన॥

యంత్రాలను సిద్ధపరచి
పనిచేయుట సులువుచేసి
మేలు చేసినారు వారు
మేలు చేసినారు మనకు ॥మన॥

నింగిలోన నేల మీద
వడివడిగా సాగిపోవు
వాహనాలు నిర్మించిరి
మనకు వారు అందించిరి ॥మన॥

# విన్నపమం

పెద్దలార! విజ్ఞులార!
మేల్కొనండి మేల్కొనండి
పక్కదారి పట్టిపోవు
జనతను కాపాడరండి
చక్కనైన మన సంస్కృతి
ముక్కముక్కలవుతున్నది
కన్ను తెరచి నిజం తెలిసి
యువతను కాపాడరండి.

ప్రేమసుధలు పంచిఇచ్చు
తల్లులార! అమ్మలార!
మీ పిల్లల పెంపకములో
జాతి భవిష్యత్తు వుంది
మొక్కగాను ఉన్నప్పుడె
చక్కదిద్దవలెనమ్మా
మన జాతీ ఔన్నత్యం
తీర్చిదిద్దవలెనమ్మా.

విద్యనేర్పు గురువులార!
బరువైనది మీ బాధ్యత
విధులు నిర్వహించుటలో
సదా శ్రద్ధ చూపండి
కాపీ సంస్కృతి నుండి
విద్యను రక్షించరండి
విజ్ఞానము పెంచుకొనుచు
పలు విద్యలు పంచరండి.

దేశమ్మును పాలించే
నేతలార! నేతలార!
దేశభక్తి చిత్తశుద్ధి
మరువవద్దు మరువవద్దు
రాజ్యాంగము ననుసరించి
పరిపాలన చేయరండి
పక్షపాత దృష్టిలేక
పరిపాలన చేయరండి

కళాకారులార! మీరు
రండి రండి కదలిరండి
నవతకోరు మనజనమును
పరీక్షించి పరీక్షించి
మేటి కళారూపాలను
సిద్ధపరచి సిద్ధపరచి
జనం మెచ్చ జగం మెచ్చ
అందించుడు అందించుడు.

శ్రామిక జనులార! మీరు
కలసిరండి కదలిరండి
చురుకుదనం నైపుణ్యం
పెంచుకోండి పెంచుకోండి
వేగముగా నాణ్యతగల
వస్తువులను చేయరండి
ఇంటింటికి అవసరమగు
వస్తువులను ఇవ్వరండి

రైతులార! రైతులార!
కదలిరండి కదలిరండి
సులభముగా పనులు చేయు
పరికరాలు పట్టరండి
అధికపంట పండునట్టి
వంగడాలు పెట్టరండి
దేశమ్మును మేటి ధాన్య
రాసులతో నింపరండి.

యువతులార! యువకులార!
ఈ దేశపు పౌరులార!
విభేదాలు తగాదాలు
విడిచి ఉద్యమించండీ
బాధ్యతతో ప్రవర్తించి
దేశ ప్రగతి పెంచండీ
పరుల మేలు కోరి మీరు
సౌజన్యం పెంచండీ.

# విలువ

ఉలిదెబ్బలు తినని శిలలు శిలలుగానె పడిఉండును.
ఉలిదెబ్బలు తట్టుకొనిన శిలలు ప్రతిమలై నిలుచును.

అక్షరాలు అచ్చుకాని కాగిదమ్ము విలువయెంత?
అక్షరాలు అచ్చువేయ దాని విలువ పెరుగునెంత?

మట్టిలోన పడని విత్తు సత్తు తరిగిపోవుచుండు
మట్టిలోన పడిన విత్తు ఎత్తు పెరిగిపోవుచుండు.

# త్యాగమూర్తులు

సాగరుడు ఏ ఫలమునాశించి ఆశించి
ప్రాణకోటికి నీటినందించుచుండు?
భూజములు ఏమేమి ఆశించి ఆశించి
జీవకోటికి ఫలాదుల నిచ్చుచుండు?

దినకరుడు దినదినము ఏమేమి ఆశించి
నింగిలో తిరుగుచూ వెలుగు పంచు?
రేరాజు మననుండి ఏమేమి ఆశించి
రేయంత వెన్నెలను పంచుచుండు?

మేఘములు ఏమేమి లాభములు ఆశించి
నేలపై నీరమును వదలుచుండు?
పవనుండు ఫలితాలు ఏమేమి ఆశించి
సర్వప్రాణుల నెపుడు కాచుచుండు?

ఉచితముగ పుణ్యమూర్తులు సేవచేసి
ధన్యులగుదురు శాశ్వత కీర్తితోన
మనము సహితము పరులకూ హితముచేసి
మనుజ జాతికి విలువ పెంచంగవలయు.

# వెలుగొందును

క్రమశిక్షణ, ఏకాగ్రత
కలిగియున్న మానవుడే
లక్ష్యమ్మును సాధించును
విజయుండై వెలుగొందును

# ధృవతార

తెలుగు జాతి గర్వించే
కవివి నీవు సినారె.
సారస్వత గగనమందు
రవివి నీవు సినారె.

కవితలలో సుధలు నింపి
పంచినావు సినారె.
తెలుగు కవిత అందాలను
పెంచినావు సినారె.

చలన చిత్ర రంగములో
కవి తారవు సినారె.
శ్రోతల హృదయాలలోన
ధృవతారవు సినారె.

# కవన రణం

కావ్య నిర్మాణ సంగ్రామములో
పదాల దళాలను ఉపయోగిస్తూ
సమాసాల ఫిరంగులను ప్రయోగిస్తూ
ఛందస్సనే వ్యూహాలను మారుస్తూ
కవనం సాగిస్తాను.
విజయం సాధిస్తాను.

## ఆనందవనం

ఎందుకో ఆనాడు ఆనందమనిపించె
ఆనందమనిపించె పాడవలెననిపించె
ఎందుకో ఈనాడు సంతోషమనిపించె
సంతోషమనిపించె రాయవలెననిసించె
ఆనాడు ఈనాడు ఏమి సాధించితిని
ఏమి సాధించితిని రాసినా పాడినా?
ఏనాటికైననూ ఏమి సాధించెదను?
ఏమి సాధించెదను ఆనందమే కదా!
అందుకే అందుకే ఆనందమనిపించు
ఆనందమనిపించు రాసినా పాడినా.
ఆనందమే కదా! ప్రతి జీవి కోరేది
ప్రతి జీవి కోరేది ఆనందమే కదా!

## సహజశక్తి

తమ్మి పువ్వుల చెంత తిరుగుచుండెడు కప్ప
తేనె చుక్కను కూడ త్రాగజాలదు లెమ్మ.
దూర ప్రాంతము నుండి వచ్చి వేరెడు తేటి
తేనెనంతయు త్రాగి వెళ్ళజాలును సుమ్మ.
కానిచోట పుట్టినా కాకిఇంట పెరిగినా
సహజశక్తితో కోయిల మధురముగా కూయదా?
పంకములో పుట్టిన పద్మం పరిమళాలు పంచుట లేదా?
పూరి గుడిసెలో పుట్టిన మనీషి ఎర్రకోటపై కెక్కుటలేదా?

# ప్రకృతి వింతలు

ఆలోచన పరిశీలన
అలపోకగ వోగిస్తే
ప్రకృతి ఒక విచిత్రమైన
మార్పు గలది యనిపించును.

రవిచంద్రులు అకసాన
తిరుగుచుందురు.
ఆహారం ఆనందం
పెంచుచుందురు.

కనిపించని గాలి నిన్ను
తట్టుచుండును
కాల్చివేయు మంట నీట
పుట్టుచుండును.

ఆలోచన పరిశోధన
అదే పనిగ సాగిస్తే
సృష్టిలోని రహస్యాలు
బట్టబయలు చేయవచ్చు.

# చెల్లు

కడుపు నిండుగ మెక్కి కొవ్వెక్కి తిరిగేటి
పన్నగము తన కొరకు గూడు కట్టగలేదు.
చిట్టిచీమలు కట్టగలిగిన పుట్టమేడను ఆక్రమించును.
శ్రమ చేయువారి గతి ఇంతేనా? విషమతుల చేష్టలే చెల్లాలా?

# పతనానికి కారణాలు

చెప్పెదవిను చెప్పెదవిను
కారణాలు కారణాలు
సామాజిక పతనానికి
కారణాలు చెప్పెదవిను.

అధర్మాలు, అక్రమాలు
పతనానికి కారణాలు
అవినీతి, అన్యాయం
పతనానికి కారణాలు.

పేదరికం, బిక్షాటన
త్రాగుట, జూదమ్మాడుట
వ్యభిచారం, దొంగతనం
చేయాలని యోచించుట
కారణాలు కారణాలు
పతనానికి కారణాలు.

అజ్ఞానం, మూర్ఖత్వం
ఈర్ష్యా, అవినీతిపనులు
అక్రమ సంపాదనకై
ఆలోచన సాగించుట
సామాజిక పతనానికి
ఇవేకదా కారణాలు.

పెరిగిపోవు జనాభాకు
తగిన వనతి లేకుండుట
కరువులతో వరదలతో
రోగమ్ములు వ్యాపించుట
కారణాలు దుఃఖానికి
ఇవేకదా ఇవేకదా.

మూఢనమ్మకాలలో
మునిగి తేలుచుండుట
పక్షపాత బుద్ధితో
పరిపాలన చేయుట
కారణాలు ఇవేకదా
పతనానికి కారణాలు.

## గోమాత

గోమాతను రక్షించుట
మనధర్మం, నవధర్మం
గోమాతను పూజించుట
నాటి మేటి, మనధర్మం.

ధర్మాత్ములు గోమాతను
కామధేనువంటారు.
పుణ్యాత్ములు గోమాతను
దేవతయని అంటారు.

పచ్చగడ్డి మేసి ఆవు
కమ్మని పాలిస్తుంది.
గడ్డిమేసి ఆవు మనకు
మంచి ఎరువు ఇస్తుంది.

పంటలు పండించుటకు
పనికివచ్చు గోసంతతి
పదార్థాల పంపిణీకి
ఉపకరించు గోసంతతి.

సద్గుణాలు కల ఆవును
సాధుబుద్ది కల గోవును
జంతువులూ మానవులూ
చంపివేసి తినుచుందురు.

చంపవద్దు చంపవద్దు
గోమాతను చంపవద్దు
పెంచవలెను పెంచవలెను
గోజాతిని పెంచవలెను.

గోమాతను పోషించుట
మనధర్మం, నవధర్మం
గోజాతిని రక్షించుట
నవధర్మం, మనధర్మం

## మాటల మంటాట

పదము పదము కలసినపుడు జనియించును భావం.
శబ్దశక్తి చేత వక్త ప్రకటించును భావం.
లయబద్ధముగాను మనం పాడినపుడు పాట
స్వరమాధుర్యమ్ము చేత రక్తినొసగు పాట.
మనసు మనసు కలసినపుడు చెలిమి పెంచు మాట
చెలిమి బలిమి కన్న మిన్న ఏమున్నది మాట.

## పేదరికం

సంపాదన మించి మీరు
ఖర్చులు చేస్తే—
అవసరాన్ని మించి మీరు
ఖర్చులు చేస్తే
ఆదాయం మించి మీరు
అప్పులు చేస్తే—
అందినంత వరకు మీరు
అప్పులు చేస్తే
పేదరికం నెత్తికెక్కి
కూర్చుంటుందీ—
అప్పిచ్చినవారు మిమ్ము
బాధిస్తారూ—
శక్తి మేరకు ఖర్చు చేయుడు
పేదరికమే ఉండదూ
పొదుపు చేయుచు ఖర్చు చేయుడు
పేదరికమే ఉండదూ

# మా జాతిని పెంచండి

మట్టిలోని సారము తిని
పెరుగుతాను పెరుగుతాను.
పెరిగి పెరిగి ప్రాణతతికి
ఫలితమ్మును పంచుతాను.

నేలలోన దాగియున్న
నీరు నేను త్రాగుతాను.
నీరు త్రాగి పెరిగి నేను
మంచి గాలి పెంచుతాను.

రవి రశ్మిని అనుభవించి
నింగిలోకి సాగుతాను.
నింగిలోకి సాగి మీకు
నీడ నేను పంచుతాను.

కొమ్మలతో ఆకులతో
పవనాలను ఆపుతాను.
పవనాలను ఆపి నేను
వర్షము కురిపించుతాను.

పెంచుకొనుడు పెంచుకొనుడు
మా జాతినీ పెంచుకొనుడు.
మా జాతిని పెంచుకొనిన
మీ జాతికి మేలు కలుగు.

# స్వేచ్ఛ

నాకు—
ఎగరాలని వుంది.
స్వేచ్ఛగా
ఎగరాలని వుంది.
పతంగిలా కాదు
పక్షిలా ఎగరాలని వుంది
పతంగిలా ఎగిరితే
ఎగరేసేవాని ఇష్టాన్ని బట్టి
గాలి వాలును బట్టి
ఎగరాల్సివుంటుంది.
గాలి బలంతో (అ) దారం తెగిపోతే
పతనం చెందాల్సి వుంటుంది.
పరితాపం చెందాల్సివుంటుంది.
అందుకే—
పక్షిలా ఎగరాలని వుంది.
పక్షిలా ఎగిరితే—
ఎగరడంలో స్వేచ్ఛవుంది.
గాలి వాలును బట్టి
గమ్యం మార్చుకోనక్కరలేదు.
గాలి ఆటంక పరచినా

శరీరానికి బాధ కలిగినా
ఆలస్యం జరిగినా
తప్పకుండా
గమ్యం చేరుకోవచ్చు.
అభిమాన హీనులు
పతంగిలా జీవిస్తారు.
అభిమానధనులు
పక్షిలా స్వేచ్ఛగా జీవిస్తారు.

## గాడిద

బాట ప్రక్కన బక్కచిక్కిన
గార్దభమ్మును చూచియుంటిని.
తిండిలేని దానిమోమున వి
షాద రేఖలు కానవచ్చెను.
బక్కమెడ వ్రేలాడుచుండెను
కాళ్లు తడబడ నడచుచుండెను.
దిక్కులేనీ గాడిదలకూ
దిక్కు ఎవ్వరు దేవుడేకద!
మనుజులే దేవుళ్లు అయితే
ఏ గాడిదైనా బాధపడునా?
(ఆంగ్ల కవిత ఆధారంగా)

# ఏమి ఉండాలి?

అధర్మమును ఖండించే
ధర్మ నియతి ఉండాలి.
అన్యాయమునెదిరించే
సాహస గుణముండాలి.
అవినీతిని బయటపెట్టు
చాతుర్యం ఉండాలి.
అసత్యాన్ని తుడిచిపెట్టు
నిజము పలుకుతుండాలి.
స్వార్థమ్మును నెట్టివేయు
త్యాగబుద్ధి ఉండాలి.
బలహీనుల పట్ల ఎపుడు
కరుణ కలిగి ఉండాలి.

# మెప్పు

రాత్రి వేళల్లోన రేరాజుసూ జూచి
మబ్బు మగువలు ముదము ప్రకటించగలుగుదురు.
కవి పుంగవులు కథలు రచియించగలుగుదురు.
పగలంత దినకరుడు పనిచేయగలిగినా-
సర్వజీవుల నతడు రక్షించగలిగినా-
మెప్పు పొందగలేడు. ఎందువలనో చెప్పు?

# అభివృద్ధి

పేదరికం తొలగించగ యోచించుమురా.
అభ్యుదయం సాధించగ యత్నించుమురా.

ప్రగతి పెంచనట్టి పనులు వదలిపెట్టురా.
పెంపునిచ్చు పథకాలను చేపట్టుమురా.

యంత్రాలతో వ్యవసాయం చేపట్టుమురా.
పలు పంటలు వేసి ఫలము రాబట్టుమురా

పుష్కలముగ పంటలను పండించుమురా.
పుష్టినిచ్చు ఆహారం తినుచుండుమురా.

సహజ వనరులన్నింటిని వాడుకొనుమురా.
ప్రతిదినము ప్రగతి కొరకు పాటుబడుమురా.

అనవసరపు ఖర్చులనూ తగ్గించుమురా.
ఆదాయం పెంపుకొరకు యోచించుమురా.

పెంచలేని జనాభాను పెంచబోకురా.
మితము హితమ్మను భావన పాటించుమురా.

పలురకముల పరిశ్రమలు స్థాపించుమురా.
శ్రమ చేయుచు ఫలితమ్మును ఆశించుమురా.

పరిపాలన వ్యవస్థను సరిదిద్దుమురా.
ప్రజల హితము కోరి నీవు పాలించుమురా.

ప్రణాళికలు వేసి ప్రగతి సాధించుమురా.
ప్రతి మనిషికి అభివృద్ధిని అందించుమురా.

## తేనెపాట

పాట నేను పాడుతాను
తేనె వాన కురియునట్లు
తేనె పాట పాడుతాను
తేనె వాగు సాగునట్లు.

మౌనంగా ఉన్న మునులు
మెచ్చి మాటలాడునట్లు
పాడుతాను పరవశించి
పాట నేను పాడుతాను.

మాట్లాడే "మర్కటాలు"
మౌనముద్ర దాల్చునట్లు
పరవశించి తేనెపాట
పాడుతాను పాడుతాను.

## పసిడి ఫలములు

పండుటాకులు రాలి
మట్టిలో మట్టిలా మారిపోతేనే
పసిడి ఆకులు పుట్టి పులకరిస్తాయి.

నేలసారం మింగి
చెట్టు నింగిలోకి ఎదిగిపోతేనే
పసిడి ఫలములు వచ్చి పలకరిస్తాయి.

# క్షమించండి

పరవారలు తెల్లవారు
మనవారల నణచుచుండ
ప్రతిఘటించి పారద్రోలి
స్వేచ్ఛను సాధించినట్టి
చరిత్ర కెక్కిన మహాత్ములార!
క్షమించండి మమ్ము.
మనవారే మనవారిని
పలురకాల బలములతో
అణచివేయు చుండిననూ
చూచి ఆపలేని మమ్ము
చరిత్ర కెక్కిన మహాత్ములార!
క్షమించండి మీరు. ॥చరిత్ర॥

కన్యాశుల్కమ్మనియెడు
దురాచార మాపివేసి
తరుణుల అభివృద్ధి కొరకు
త్యాగమ్ములు చేసినట్టి
చరిత్ర కెక్కిన మహాత్ములార!
క్షమించండి మమ్ము.
వరకట్నపు మంటలలో
పడతుల బంగారు బ్రతుకు
బుగ్గిపాలు అవుతుండగ
చూచి ఆపలేని మమ్ము
చరిత్ర కెక్కిన మహాత్ములార!
క్షమించండి మీరు. ॥చరిత్ర॥

# ఏమవునో?

ఏమవునో ఏమవునో మనిషి బ్రతుకు ఏమవునో
సమత మమత తరిగినట్టి మనిషి మనసు ఏమవునో
అంతులేని స్వార్థమున్న మనుజ జాతి ఏమవునో ॥ఏ॥

ఆలోచన పెంచుకొనీ అన్వేషణ చేసి చేసి
నేలపైన ఉన్న సర్వజీవులపై ఆధిక్యత
సాధించిన మనిషి మనసు వికటించిన తరుణమందు ॥ఏ॥

భూమిపైన అడుగడుగున సంపదకై వెదకి వెదకి
సంపద పొందేటోటును పొందాలను పోటీలో
మనిషి మనిషి మధ్య తగవు చిచ్చులాగ వ్యాపించిన ॥ఏ॥

నేల కొరకు తగవులాట నీటి కొరకు తగవులాట
ఆస్తి కొరకు అంతులేని తగవులాట తగవులాట
మనుజులలో తగవులాడు బుద్ధి ఇంక పెరిగిపోతె ॥ఏ॥

ఆయుధాల సంఖ్య పెంచి శాంతిమాట మరచిపోయి
రణపిపాస కలిగి మనిషి కయ్యానికి కాలుదువ్వి
రణభంగముభేరి యుద్ధభేరి గనుక మ్రోగిస్తే ॥ఏ॥

# ఎందుకు పోరాడుతారు?

ఎందుకు పోరాడుతారు?
ఏమి మీరు సాధింతురు?
ఎందుకింత దుడుకుతనం?
ఎందుకింత అవివేకం?

కురుక్షేత్ర యుద్ధములో
దుర్యోధనుడేమయ్యెను?
రామాయణ గాథయందు
రాక్షస గణమేమయ్యెను?

బుద్ధుడు బోధించినట్టి
బుద్ధిమాట మరచారా?
తాతగారు చెప్పినట్టి
శాంతిమాట మరచారా?

అవివేకపు ఆలోచన
మానుకొనుడు మానుకొనుడు
అంతులేని స్వార్థమ్మును
అణచుకొనుడు అణచుకొనుడు.

ఆధిక్యత కొరకు మీరు
ఆయుధాలు పట్టవద్దు.
కన్నతల్లి హృదయములో
చిచ్చు మీరు పెట్టవద్దు.

# పాడవే కోకిలా!

పాడవే కోకిలా!
మధురమగు నీ పాట
నా మదిలో నిలచినా
దిగులు తొలగేదాక ॥పాడవే॥

ప్రియురాలి పాటలను
నీ గళము వినిపించు
నీ గాన లహరిలో
ప్రియురాలు కనిపించు ॥పాడవే॥

నీ మధుర గానమును
ఆలకించుట కొరకు
నా చెలీ అరుదెంచు
నా మదిని మురిసించు ॥పాడవే॥

నా చెలీ ఎడబాటు
నేనోర్వ లేను
చెలియ కనబడుదాక
పాడవే పాట ॥పాడవే॥

# అన్నదాతా! వందనము

అందుకో నా వందనం
అన్నదాతా! వందనం ॥అందుకో॥

హలము, పార పట్టువాడా!
కాయకష్టం చేయువాడా! ॥అందుకో॥

మేలురకపు విత్తనాలు
చల్లి సేద్యం చేయువాడా! ॥అందుకో॥

మట్టిలో పనిచేయువాడా!
మేటి పంటలు తీయువాడా! ॥అందుకో॥

పాడియావులు పెంచువాడా!
పసిడి పంటలు పంచువాడా! ॥అందుకో॥

## ఊయల

ఊయలలో ఎంత పైకి వెళ్ళాలనుకొందువీవు?
ఆకాశం వైపు అలా వెళ్ళాలనుకొందువు కద!
యోచించగ ఇది మిక్కిలి సంతోషమ్మగు విషయం
ఎల్లప్పుడు ప్రతిబాలుడు యోచించును ఈ విధముగ.

ఎగురుచుంటి గాలిలోకి అంతెత్తుగోడపైకి
ఎంతెంతో దూరానికి చూడజాలుచుంటి నేను
నదులు మహావృక్షమ్ములు పశు సంతతి అవిగవిగో
ఈ పల్లెను ఎగిరి ఎగిరి అద్యంతము చూచుచుంటి.

పచ్చని ఆ పూలతోట అందాలను చూచుచుంటి
ఆ గుడిసెల పైకప్పుల తీరునేను గాంచుచుంటి
తిరిగి తిరిగి గాలిలోకి పైకి ఎగిరి పోవుచుంటి
నింగివైపు నేలవైపు సాగి నేను వెళ్ళుచుంటి.

["రాబర్టు లూయిస్ స్టీవెన్‌సన్" ఆంగ్ల కవిత ఆధారంగా]

## భిక్షాటన

భిక్షాటన ఒక సమస్య
జటిలమైనదీ సమస్య
మన సంఘం మారునా?
ఈ సమస్య తీరునా?

పంటలు పండించుటకు
నేల లేని పేదవారు
కాపురాలు చేయుటకు
గూడులేని పేదవారు.

జీవించుట కొరకు వీరు
పరువు వదలి యాచింతురు.
పని దొరకనివారు సదా
పరులనడిగి జీవింతురు.

పనులు చేయలేని వారు
యాచించుచు జీవింతురు.
శ్రమ చేయని వారందరు
శ్రామికులను బాధింతురు.

దీర్ఘరోగమున్న వాళ్లు
బ్రతుకుటకై యాచింతురు.
అనాధలూ, అభాగ్యులూ
దీనంగా యాచింతురు.

పాలకులే ప్రతి మనిషికి
పని కల్పిస్తే—
భిక్షాటన నేరమని
చట్టము చేస్తే—

అంటువ్యాధి కలవారికి
రక్షణ కల్పిస్తే
వికలాంగుల కొరకు చిన్న
వృత్తులు కల్పిస్తే—

యాచించే వారుండరు
ఈ దేశంలో
పనికిరాని వారుండరు
మన దేశములో

ఈ సమస్య తీరువరకు
మన సంఘం మారు వరకు
కృషి చేద్దాం సోదరా!
కృషి చేద్దాం సోదరీ!

## ఎందుకు?

వర్షించని మేఘమాల
అంబరాన యెందుకు?
పుష్పించని ఫలమివ్వని
వృక్షజాతి యెందుకు?

అజ్ఞానము తొలగించని
ఉపాధ్యాయుడెందుకు?
విజ్ఞానము పెంచునట్టి
పుస్తకాలు యెందుకు?

ప్రగతిని కలిగించనట్టి
పనులు చేయుటెందుకు?
మృగతృష్ణలో నీటి కొరకు
అన్వేషణ యెందుకు?

సహకారము చేయనట్టి
సహచరుడూ యెందుకు?
మనిషిలాగ బ్రతుకలేని
మనిషి బ్రతుకు యెందుకు?

# కుటుంబాలు

కొన్ని కొన్ని కుటుంబాలు
చిక్కుల పాలవుతున్నవి.
పెద్ద పెద్ద కుటుంబాలు
చెక్కచెక్కలవుతున్నవి. ॥కొన్ని॥

స్థిరమగు ఆస్తులు
సరిపోనందున
ప్రేమ భావములు
స్థిరపడనందున ॥కొన్ని॥

క్రమశిక్షణ తరిగిపోయి
కోరికలూ పెరిగిపోయి
అసంతృప్తి రగిలిపోయి
ఆత్మీయత కరిగిపోయి ॥కొన్ని॥

ఆలుమగల తగవులతో
అదుపులేని పిల్లలతో
మితిమీరిన సంతతితో
అంతులేని ఖర్చులతో ॥కొన్ని॥

కొన్ని కొన్ని కుటుంబాలు
చిక్కుల పాలవుతున్నవి.
పెద్ద పెద్ద కుటుంబాలు
చెక్కచెక్కలవుతున్నవి. ॥కొన్ని॥

# బంగారు బావ

వస్తాడు నా బావ వస్తాడు.
తాగుతూ ఊగుతూ వస్తాడు. ॥వస్తాడు॥

పగలంత పనిజేసి
కల్లు కడివెడు తాగి
చీకటయ్యేవేళ
చీకాకు పడుకుంట ॥వస్తాడు॥

తాగద్దు నీవంటె
తాగనని అంటాడు.
వాగద్దు నీవంటె
వాగనని అంటాడు.

తాగనని వాగనని
తాగుతూ ఉంటాడు.
తాగుతూ ఊగుతూ
వాగుతూ ఉంటాడు. ॥వస్తాడు॥

పనులు దొరకనినాడు
పైస దొరకనినాడు
తాగడానికి బిందె
తాకట్టు పెడుతాడు.

వద్దు వద్దని నేను
అడ్డు చెప్పిననాడు
తాగకుంటే తాను
బ్రతకలేనంటాడు.

నా కళ్లు నీటితో
నిండిపోయిన వేళ
మాయ మాటలు చెప్పి
కళ్లు తుడిచేస్తాడు. ॥వస్తాడు॥

## శిల్పవరం

అందమైన శిల్పాలను
అందించిన శిల్పులార!
అందుకోండి అందుకోండి
వంద వంద వందనాలు. ॥అందమైన॥

పరికరాలు పట్టి మీరు
శిలల మేను తట్టినారు
ప్రత్యేకత లేని శిలల
ప్రతిమలుగా మార్చినారు. ॥అందమైన॥

మనసులోని భావాలను
శిలలపైన నిలిపినారు
అందమైన భావాలకు
ఆకృతులను ఇచ్చినారు. ॥అందమైన॥

"ఎల్లోరా" శిల్పాలను చూచినప్పుడు
నాలో ఉదయించిన భావాలకు అక్షరాకృతి

# లెక్కల పాట

లెక్కలు చేద్దామా ముద్దుగ
లెక్కలు చేద్దామా
ఆలోచిస్తూ ఆలోచిస్తూ
లెక్కలు చేద్దామా మనమూ
లెక్కలు చేద్దామా ॥లెక్కలు॥

ఒకటీ రెండూ మూడంటూ
మూడూ నాలుగు ఏడంటూ
అయిదూ ఆరూ ఏవంటూ
సున్న ఎనిమిది కూడినప్పుడు
తొమ్మిది కానేకాదంటూ ॥లెక్కలు॥

సంకలనాలు వ్యవకలనాలు
చక్కగ చేద్దామా మనమూ
లెక్కలు చేద్దామా
గుణకారములు భాగహారములు
బాగుగ చేద్దామా మనమూ
లెక్కలు చేద్దామా ॥లెక్కలు॥

సూత్రాలన్ని జ్ఞప్తికి ఉంటే
లెక్కలు చేయుట సులభతరం
సిద్ధాంతాలను నెమరేస్తుంటే
లెక్కలు చేయుట సులభతరం ॥లెక్కలు॥

లెక్కలు చేసే పద్ధతులన్నీ
తప్పక మనమూ నేర్చేద్దాం
ఆలోచిస్తూ అభ్యాసాలను
తప్పక మనమూ చేసేద్దాం ॥లెక్కలు॥

# పెరుగుదల

నాకు ఏడు వత్సరాల
ప్రాయమున్న కాలమందు
విపినమందు విహరించగ
మిత్రులతో వెళ్ళినాను.
బండరాళ్ళ వెనుక పులులు
దాగివుండునని తెలిసెను.
గుండెలోన గుబులు గుబులు
అనిపించెను అనిపించెను.
కనిపించిన కాననమును
కన్నులార గాంచినాను.
ఎంత సేపు వీక్షించిన
ఒక్క పులిని కాంచలేదు.
కొన్ని కొన్ని దశాబ్దాలు
గడచిపోయె గడచిపోయె.
చిన్ననాడు చూచినట్టి
అడవిచూడ మనసయ్యెను.
చిన్ననాటి మిత్రులతో
అడవిలోకి వచ్చినాము.
చూడ చూడ ఆ వనమ్ము
చిన్నదిగా అగుపించెను.
బండరాళ్లు కూడ నేడు
చిన్నవియే అనిపించెను.
వనులుగాని గిరులుగాని
జంతువులను దాచవుకద!
దోచగలవు దోచగలవు
మనిషి కళా హృదయమ్మును.

(ఆంగ్ల కవిత ఆధారంగా)

# మన మనసే కోకిల

భావుకుడు, యథార్థవాదీ అయిన శ్రీ రేగులపాటి కిషన్‌రావు గారు సహృదయుడైన గేయకర్త. ఏదైనా మనసు స్పందనను అనుసరించి మాత్రమే చేయడమూ, చెప్పడమూ గీతాల్లో పరిమళము గుప్పుమనిపించడమూ, ఈ త్రికరణ శుద్ధి వారి రచనలలో జీవితంలో ఉన్న విశేషము. వారి గీతమే ఒకటి "పాడవే కోకిలా మధురమగు నీపాట" దానిని శ్రీ జి. శంకరశర్మ గారు అద్భుత స్వరకల్పనతో తీరిచి దిద్దినారు.

'ధ్రువతార' అన్న గీతం సినారెను ప్రశంసించే మధుర గీతి. 'మేలుచేసినారు' అన్న కవిత వ్యక్తుల ఔన్నత్యాన్ని, ఆదర్శాన్ని కీర్తించి గత చరిత్ర శోభను స్ఫురింపజేస్తుంది.

ఈ సంపుటిలో గేయముల లయవిన్యాసాలు అన్నీ వివిధ గతులలో సాగినవి. గేయశిల్పం విషయంలో ఇతను సమర్థవంతుడయిన క్రీడాకారుడు.

'మా జాతిని పెంచండి' అంటూ చెట్లు ప్రార్థించేటపుడూ గోమాత గురించి మన కర్తవ్యం చెప్పినపుడు-మనిషి దౌష్ట్యానికి కరిగిపోకుండా ఉండలేం. ఖండించకుండానూ ఉండలేం. అదీ కవి సాధించే విజయం.

'ఆంగ్ల కవిత ఆధారంగా' అంటూ వీరు గతంలో కొన్ని అనుసృజనలూ, అనువాదములూ చేసియున్నారు. ఈ సంపుటిలోని 'గాడిద' 'పెరుగుదల' అలాంటివి. ఆంగ్లములో వీరు ఇంకా కృషిచేసి అనువాదకుడుగా రాణించాలనీ అభిలాష.

మనిషి అన్నవాడు ఎలా వుండాలి? అనే ప్రశ్నకు ఈ గేయ సంపుటి ఒక సమధానం. ఇదొక అన్వేషణతో కూడిన శ్రమకు కవి పొందిన సత్ఫలము. హితము ఆనందము రెండూ లభించే కోయిల గీతాలకు ఇదే నా అభివాదం.

పాతూరి రఘురామయ్య
తెలుగు లెక్చరర్.

తేది 20-10-1995
రుద్రంగి.